# శ్రీ ఆంజనేయ స్తోత్ర మకరందము



సంకలనము
**అక్షర రచన**




## సరస్వతి పబ్లికేషన్

సత్యనారాయణ పురం, విజయవాడ - 11

# SRI ANJANEYA STHOTRA MAKARANDAM

by Akshra Rachna



FIRST EDITION :

*2002*

PAGE MAKERS :

*VISWA DIGITALS*
*Annapurna devi Street,*
*Gandhinagar, Vijayawada - 3*
*Ph. 400 023*

COVER DESIGN :

*N.V. Ramana*

PRINTED AT :

Ph : 664458, 664457
**KAMAKSHI WEB OFF SET**
VENKATESWARA RAO STREET, ELURU ROAD,
VIJAYAWADA - 2.

PUBLISHED BY :

SARASWATI PUBLICATION

*Satyanarana puram,*
*Vijayawada- 11*

*Price: Rs.* 20/-



# విషయసూచిక

# ముందుమాట

సాక్షాత్ రుద్ర స్వరూపుడు, పరమ భక్తాగ్రేసరుడూ అయిన ఆంజనేయ స్వామి శైవ-వైష్ణవ యిత్యాది సంప్రదాయాలకు అతీతంగా భక్తకోటిని అనుగ్రహించే ఉపాస్యదైవతం.

తనను కొలిచిన భక్తుల సర్వకామ్యాలు అనుగ్రహించి, గ్రహ, గృహ, భూత పిశాచ పీడలను తొలగించి, సర్వ శుభాలూ కటాక్షించగల శ్రీ అభయాంజనేయ స్వామి.

సకల దేవతా స్వరూపుడైన ఆంజనేయస్వామిని పూజిస్తే దేవతలందర్నీ పూజించినట్లే! అని నిరూపించగల గ్రంథం.

అట్టి రామభక్త హనుమంతుని ధ్యానించి, పూజించి, అర్చించి, ఆయురారోగ్యాలనూ పొందగలరు.

ఈ పుస్తకమునందు సీతారామ సమేత శ్రీ ఆంజనేయుని అష్టోత్తర, శతనామావళులు, శ్రీ ఆంజనేయ స్వామి జన్మవృత్తాంతము పార్వతీకి పరమశివుడు ఆంజనేయస్వామి జన్మ వృత్తాంతము తెలియపరచుటము, సప్తముఖీ, పంచముఖీ ఆంజనేయ స్వామికి ఏ ఏ పూజలు చేస్తే వారు మనకు ఏ ఏ విధములా అనుగ్రహిస్తారో వివరముగా సంకలనము చేయబడినది. చివరిగా హనుమాన్ చాలీసా (తులసీదాసు), భక్త పురందరదాసు కీర్తనలు ఇందు ప్రత్యేకత. ఈ పుస్తకాన్ని అనేక గ్రంథాల ఆధారములుగా సంకలనము చేయబడినది.

జై హనుమాన్

అక్షర రచన

## శ్రీరామహనుమతేనమః



సాక్షాత్ రుద్ర స్వరూపుడు, పరమ వైష్ణవ భక్తాగ్రేసరుడూ అయిన ఆంజనేయస్వామి శైవ-వైష్ణవ యిత్యాది సంప్రదాయాలకు అతీతంగా భక్తకోటిని అనుగ్రహించే ఉపాస్యదైవతం.

అమేయ బలసంపన్నుడు, ఆర్తత్రాణ పరాయణుడూ, సకల ఆపదలనుండీ, పిశాచ పీడలనుండీ కాచి రక్షించే దైవం వీరాంజనేయ స్వామి.

తనను కొలిచిన భక్తుల సర్వకామ్యాలు అనుగ్రహించి, గ్రహ, గృహ, రాక్షస పీడలను తొలగించి, సర్వ శుభాలూ సమృద్ధిగా కటాక్షించగల సమర్థుడు అభయాంజనేయ స్వామి.

సకల దేవతా స్వరూపుడైన ఆంజనేయస్వామిని పూజిస్తే దేవతలందర్నీ పూజించినట్లే!

అట్టి రామభక్త హనుమంతుని ధ్యానించి, పూజించి, అర్చించి, అష్టైశ్వర్యాలనూ, ఆయురారోగ్యాలనూ, సుఖశాంతులనూ అపరిమితంగా పొందండి.



## శ్రీ గణపతి ధ్యానమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే సర్వవిఘ్నోపశాన్తయే॥

## గురుంపరంపరా స్తోత్రము

గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ త్పరంబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః ॥

## ఇష్టదేవతా ప్రార్థన

శ్లో॥ సీతారాఘవదత్త మౌక్తిక లస త్తారావళీ శోభితం
హస్తాంభోజ వరాభయాంకిత మనే కాకల్పరత్నోజ్జ్వలం
వాలావేష్టిత మౌళి మీశ్వరతనుం భక్తానుకల్పద్రుమం
రాజ న్మౌంజ్యజినోపవీత మనిశం శ్రీ ఆంజనేయం భజే ॥



## శ్రీ ఆంజనేయ జన్మ వృత్తాంతము



### పరాశర సంహిత

### మైత్రేయులకు పరాశరుడు చెప్పుట

శ్లో॥ మైత్రేయ జవతాం నిత్యం మంత్ర మేకం హనూమతః ।
సప్తకోటి మహామంత్రా స్సిధ్యంత్యేవ న సంశయః ॥
ఆరాధితే కపిశ్రేష్ఠే సమస్తా అపి దేవతాః ।
భవంతి సతతం తుష్టా ః సర్వదేవాత్మకోహిః॥
యేకకేనా ప్యుపాయేన హనుమత్పూజనై ర్బుధః ।
దివసం సఫలం కుర్యాత్ స్తోత్రైర్వా వందనై రపి ॥

తా॥ హనుమన్మంత్రము నొక్కటి నిత్యము జపించుటచే సప్తకోటి మహామంత్ర సిద్ధి కలుగును. కపివరుని ఆరాధనచే సర్వదేవతారాధన ఫలము కలుగును. ఆయన సర్వదేవతా స్వరూపుడు కాన సర్వదేవతలు తుష్టులగుదురు. కాన హనుమత్పూజనము స్తోత్రము వందనములచే ప్రతిదినము సఫలము.

**పరాశర**

శ్లో॥ అన్యద్రహస్యం వక్ష్యామి కథాం పాపప్రణాశనీం
సావధానమనా భూత్వా శృణుష్వ మునిపుంగవ ॥

ఓ మైత్రేయ మహర్షి । సర్వపాప ప్రణాశనకరమగు ఒక రహస్యమగు కథను చెప్పెదను వినుము.

శ్లో॥ రాక్షసైః పీడితా దేవా బ్రహ్మాణం శరణం యయుః ।
బాధంతే రాక్షసా నిత్యం బ్రహ్మ న్లోకా నృషీంశ్చనః॥

తా॥ ఓ మైత్రేయా । రాక్షసులు దేవతలనున్ను ఋషీశ్వరుల నున్ను లోకమునున్నూ అనేక విధముల బాధించుచుండ దేవతలందరు ఆ బాధను సహింపజాలక బ్రహ్మను చూచి

శ్లో॥ తేషాం కురు వధోపాయం త్వం హినః పరమాగతిః ।
ఇత్యుక్తః ప్రాహ తా న్దేవాన్ మయాన జ్ఞాయతే వధః ॥

తా॥ ఓ బ్రహ్మదేవుడా । ఆ దుర్మార్గులను వధించు మార్గమును మాకు చెప్పవలసినది. నీ కన్న మాకు వేరు శరణ్యము లేదని చెప్పగా విని ఆ రాక్షసుల నాశనము చేయుట నావలన కాదు.

శ్లో॥ శంకరం సరిపృచ్ఛామో గచ్ఛామో రజతాచలం ।
తత్ర గత్వా మహాదేవ మూచు స్తే సపితామహా ః
రాక్షసానాం వధోపాయం కురు రుద్ర మహాప్రభో ॥

తా॥ మనమిందరము రజతాద్రి కరిగి ఈశ్వరునకు విన్నవించు కొందము రండని చెప్పి బ్రహ్మదేవుడు వారల దోడ్కోని పోగా అచ్చట రాక్షస వధోపాయమును చెప్పుమని దేవతలు శంకరుని ప్రార్థించిరి.

**శంకర ఉవాచ**

శ్లో॥ నర నారాయణం దేవం మార్తానాం చ పరాయణం ।
తిష్టంతం పరమక్షేత్రే నిత్యం బదరికాశ్రమే ॥
తం పృచ్ఛామః సుర శ్రేష్ఠ గచ్ఛామ సత్ర మా చిరమ్ ॥

తా॥ ఓ బ్రహ్మాది దేవతలారా ! ఆర్తత్రాణ పరాయణుండగు నర నారాయణుండు బదరికాశ్రమమున కలదు. మన మందరము కలసి అచ్చటికి వెళ్ళి ఏతద్వృత్తాంతము విన్నవించుకొందము రండు. ఆలస్యము చేయకుడని పలికెను.

శ్లో॥ బ్రహ్మేశాదిసురా స్సర్వేనరనారాయణం ప్రభు ।
సమస్కృత్య జగన్నాథం పప్రుచ్ఛు రిద మాదరాత్ ॥

తా॥ బ్రహ్మాది సురలందరున్నూ ఈశ్వర సహితముగా బదరికాశ్రమము చేరి జగన్నాధునకు నమస్కరించి ఇట్లు విన్నవించుకొనిరి.

శ్లో॥ బాధంతే రాక్షసా నిత్యం నరనారాయణ ప్రభో ।
ఏతేషాం తు వధోపాయం క్షప్రం కర్తు మిహార్హషి ॥

తా॥ ఓ నారాయణమూర్తీ రాక్షసుల బాధలు సహింపలేక యుంటిమి. ఆర్తులగు మమ్ము కటాక్షించి రాక్షసనాశనము చేయు ఉపాయమును శీఘ్రముగా చెప్పవలసినది.

శ్లో॥ సముహూర్తమిన ధ్యాతా ప్రోవాచ సకలాన్ సురాన్
భవిష్యతి న నందేహో రాక్షసానాం వధ స్సురాః ॥

తా॥ అట్లు మొరలిడిన దేవతల వాక్యములను విని నరనారాయణ మూర్తి ఒక క్షణకాలం ఆలోచించి ఓ దేవతలారా తప్పక రాక్షస నాశనము కాగలదు. భయములేదని వారించి.

శ్లో॥ ఇత్యుక్త్వా స్వాత్మన స్తేజ స్సమాకృష్య జనార్ధనః ।
బ్రహ్మణశ్చ సురాణాం చ తేజసా సాక మీశితుః ॥

తా॥ తనయొక్క తేజస్సును, బ్రహ్మమొదలైన దేవతల యొక్కయు. ఈశ్వరుని యొక్కయు తేజస్సులను సంగ్రహించి నటువంటి వాడై.

శ్లో॥ పిండీకృత్య దదౌరుద్రం వపో సర్వామరాత్మకమ్ ।
అథోవాచ హరివ్యక్తి రేత త్తేజోద్భవః సురా ॥
హరం త్వక్త్వా సురా స్సర్వే గచ్ఛతేతి యథాగతమ్ ॥

తా॥ ఒక ముద్దగా చేసి దానిని ఈశ్వరుని చేతి కిచ్చెను. దానిని ఈశ్వరుడు మ్రింగివేసెను. ఈ తేజస్సువలన గొప్పబలము కలిగిన వానర వ్యక్తి పుట్టును. అప్పుడు మీకష్టములన్నియు తొలగునని వారితో చెప్పి ఈశ్వరుని విడచి మీ నివాసంబులకు మీరరుగు డనెను.

శ్లో॥ తతఃకాలే మహాదేవః పర్యట న్పృథివీ మిమాం ।
పార్వతీ సమిత శ్రీమా న్వేంకటాఖ్యం గిరిం గతః ॥

తా॥ తరువాత కొంతకాలమునకు ఈశ్వరుడు పార్వతి సహితుడై భూమండలము తిరుగురు వేంకటాచలమునకు చేరెను.

శ్లో॥ నిత్యం సన్నిహితో యత్ర । శ్రీనివాస స్సతాం గతి ః ।
లభంతే పౌరుషా నర్థా న్యస్మి న్పండిత పామరాః ॥

తా॥ ఆ పర్వతమందు శ్రీనివాసమూర్తి వరముల నిచ్చి పండిత పామరులను రక్షించుచుండెను.

శ్లో॥ తౌ తత్ర దంపతీ చైకే శేషాఖ్యే చిత్రకాననే ।
చేరతుః పరమామోదీ నిర్మలోద సరిద్వరే ॥
ఏకదా పరమ ప్రీతా పార్వతి పతిదేవతా ।
క్రీడంతం సురతాసక్తం కపియుగ్మం దదర్శ హ ॥

తా॥ ఆ పుణ్యదంపతులిరువురును ఆ పర్వతమునందలి సుఖకరములైన ప్రదేశముల యందు కొంతకాలము గడిపిరి. ఒకానొక సమయమునందు పార్వతీదేవీ క్రీడార్థముగా బయలుదేరిన రెండు కోతులను చూచెను.

శ్లో॥ తత స్సా హ్రీమతీ బాలా మహాదేవస్య పశ్యత ః
పుష్పసాంద్రేషు కుంజేషు తదా రంతుం మనోదధే ॥

తా॥ అట్లు బయలుదేరిన వానరమిథునమును చూచి లజ్జగలదియై తానును పొదరిండ్లయందు క్రీడించుటకు ఆసక్తి కలదాయెను.

శ్లో॥ సర్వజ్ఞ స్తదభి ప్రాయం జ్ఞాత్వా స కపిరూపధృత్ ।
రమయామాస తాం దేవీం కపిరూపధరాం శివామ్ ॥

తా॥ సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు ఆ పార్వతీ దేవి యొక్క అభిప్రాయమును తెలుసుకొనిన వాడగుటచేత పార్వతీసహితముగా వానర రూపమును ధరించి వానరరూపముతో నున్న యామెను సంభోగాధి క్రియలచే సంతోషపరచెను.

శ్లో॥ సహస్రాబ్ధప్రమాణేన క్రీడిత్వా స మహాద్యుతిః ।
తత్తేజః పార్వతీ గర్భే నిధాయ విరరామ హ ॥

తా॥ వెయ్యి సంవత్సరములు గడిచిన పిమ్మట ఆ తేజ పుంజమును పార్వతీ గర్భమందు ప్రవేశింపజేసెను.

శ్లో॥ అగ్నౌ చిక్షేప తత్తేజః పార్వతీ దారణాక్షమా
సదాస్యశక్త స్త ద్వాయౌ నిక్షిపస్ విససర్జహ ॥

తా ॥ కపిరూపములో నున్న పార్వతి ఆ తేజస్సును ధరించుటకు అసమర్థురాలై అగ్నియందు వదలెను. అగ్నిదేవుడున్నూ భరింపజాలక వాయుదేవునకు అప్పగించెను. ఇట్లుండ

శ్లో॥ తస్మి న్కేసరిణో భార్యా కపిసాధ్వీ వరాంగనా
అంజనాపుత్ర మిచ్ఛంతీ మహాబలపరాక్రమమ్
తప శ్చచార సుమహ న్నియతేంద్రియమానసా॥

తా॥ ఇట్లుండగా కేసరియను వానరుని యొక్క భార్య అంజన యను పేరుగల వానర స్త్రీ మహాబలపరాక్రమములు గల కుమారుని పొందవలెనని గొప్పదైన తపస్సు చేసెను.

శ్లో॥ తస్మై వాయుః ప్రసన్నాత్మా త్ర్యహం ఫల మర్పయన్ ।
భక్షార్థ మేకదా తస్యా స్తత్తేజ శ్చార్పయ త్కరే
ఫలబుద్ధ్వాతు తత్తేజస్సా ప్యభక్షయ దంగనా ॥

తా॥ వాయుదేవుడు ఆమెయందు అనుగ్రహము కలిగి ప్రతిదినము భక్షించుటకు ఒక ఫలము నిచ్చుచుండెను. ఒకానొక సమమయందు ఆ చిన్నదాని యొక్క హస్తమందు ఫలము వలెనే ఆ తేజస్సును సమర్పించెను. నిత్యము వలెనే ఫల మనుకొని ఆ తేజ పిండమును అంజనాదేవి భక్షించెను.

శ్లో॥ నాతిదీ ఘే కాలేన చా ంజనా పతిదేవతా ।
స్వాంగేషు గర్భచిహ్నావి సా దృష్ట్వా హ్రీమనా హ్యభూత్ ॥

తా॥ కొద్ది కాలమునందే ఆ అంజనాదేవి గర్భమును ధరించి గర్భ చిహ్నములను చూచి లజ్జపొందెను.

శ్లో॥ విస్మయావిష్టచిత్తాం తాం వ్రతభంగవిశంకితాం
ధ్యాయంతీం భయవిత్రస్తా మాభాష్యా హా శరీరిణి ॥

తా॥ హఠాత్తుగా గర్భము ధరించుటచే ఆశ్చర్యమును పొందిన దిన్ని వ్రత భంగమువలన భయముగలదిన్నీ ధ్యానించుచున్నదిన్నీ అయినట్టి అంజనాదేవిని గురించి ఆకాశవాణి పలికెను.

శ్లో॥ మాభూత్తే వ్రతభంగోయం మావిషీద వరాననే ।
దేవప్రసాదాత్తే గర్భే మహావ్యక్తి ర్భవిష్యతి ॥

తా॥ ఓ అంజనాదేవీ ! నీకు వ్రతభంగము కాలేదు, విచారించనక్కరలేదు. భగవత్ప్రసాదముచే నీగర్భమందు మహానుభావుడు పుట్టగలడు.

శ్లో॥ ఏవ ముక్తా తు సా దేవీ ముదా పరమయా యుతా
వైశాకే మాసి కృష్ణాయాం దశమీ మందసంయుతా
పూర్వప్రోష్ఠవదాయుక్తా తథా వైధృతిసంయుతా ।
తస్యాం మధ్యాహ్న వేళాయాం జనయామాస వై సుతమ్ ।
మహాబలం మహాసత్వం విష్ణుభక్తి పరాయణమ్ ॥
సర్వ దేవమయం వీరం బ్రహ్మవిష్ణు శివాత్మకం
వేదవేదాంగం తత్త్వజ్ఞం సర్వవిద్యా విశారదమ్
సర్వ బ్రహ్మ విదాం శ్రేష్ఠం సర్వదర్శన సమ్మతం
మాణిక్య కుండలధరం దివ్య పట్టాంబరావృతమ్
కనకాచలసంకాశం పింగాక్షం హేమమాలినం
స్వర్ణయజ్ఞోపవీతిం చ మణినూపురశోభితమ్
ధ్వజవ జ్రాంకుశచ్ఛత్ర పద్మరేఖాంఘ్రిం సంయుతం
దీర్ఘలాంగూలసహితం దీర్ఘకాయం మహాహనుమ్
కౌపీన కటి సూత్రాభ్యాం విరాజంతం మహాభుజం
ఆశ్చర్య భూతం లోకానాం వజ్రసంహననమ్ కపిమ్ ॥
సర్వలక్షణ సంపన్నం కిరీట కనకాంగదం
ప్రభయామితయా విష్ణో రవతారమివాపరమ్ ॥

తా॥ ఈ ప్రకారముగా ఆకాశవాణిచే చెప్పబడినదై సంతోషముతో కొంతకాలము గడిపెను. అనంతరము వైశాఖమాసమున కృష్ణపక్ష దశమీ మందవారమున పూర్వాభాద్ర నక్షత్రము వైధృతి నామయోగముతో కూడిన దినమున మధ్యాహ్నవేళయందు మహాబలము కలిగినవాడును విష్ణుభక్తితత్పరుడును నిగ్రహానుగ్రహసమర్థుడును వేదవేదాంగ తత్త్వములను తెలిసినవాడును, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుండును, వేద శాస్త్రములు యందు జెప్పబడిన మహిమ కలవాడున్నూ, మాణిక్య కుండలములను ధరించినవాడును, దివ్య పీతాంబరమును ధరించినవాడును, మేరు సమానుడును, స్వర్ణమాలికలను, స్వర్ణయజ్ఞోపవీతమును, మణినూపురములను ధరించి నటువంటి వాడును, ధ్వజ వజ్ర అంకుశ ఛత్ర పద్మరేఖలతో గూడిన పాద పద్మములు కలిగినటువంటి వాడును. పెద్దదైనటువంటి వాలమున్నూ,

పెద్దదయిన శరీరమున్నూ బ్రహ్మతేజః పుంజితమైన ముఖపద్మము కలిగినటువంటివాడున్నూ, సర్వలక్షణ సంపన్నుడున్నూ, సర్వాశ్చర్య నిధియున్నూ గొప్పవైన భుజములు కలిగినటువంటి వాడున్నూ, కాంతిచేత విష్ణుమూర్తియొక్క మరియొక అవతారమువలెనున్న వాడున్నూ, అయిన కుమారుని అంజనా దేవి కనెను.

శ్లో॥ పపాత పుష్పవృష్టిశ్చ నేదు ర్దుందు భయో దివి
నన్మృతు ర్దేవగన్ధర్వా స్తుష్టు వుస్సిద్ధ చారణాః
వవౌ వాయు స్సుఖస్పర్శం పరితో నిర్మలోదకా ॥

తా॥ ఆ సమయమునందు దేవతలు పుష్పవర్షము కురిపించిరి. దేవదుందుభులు శుభధ్వని చేసినని. అప్సర స్త్రీలు నాట్యము చేసిరి. గంధర్వులు సంగీతము పాడిరి. సిద్ధ చారణులు సంతోషముతో స్తుతి చేసిరి. వాయువులు సుఖముగా సంచరించినవి. నదులు నిర్మలోదకములై ప్రవహించినవి.

శ్లో॥ యదాంజనా కేసరి ధర్మపత్నీ
హ్యసూత బాలం కపిసార్వభౌమం
ప్రదక్షిణాకారశిఖం మునీనాం
తదైవ వహ్ని త్రితయం విరేజే ॥

తా॥ ఏ సమయమునందు అంజనాదేవి వానర సార్వభౌముడైన మహానుభావుని కనెనో ఆ సమయమునందు మునీశ్వరుల యొక్క గార్హపత్యము, అహవనీయము, దక్షిణాగ్ని యను అగ్నిత్రయము ప్రదక్షణ జ్వాలలతో శుభసూచకముగా ప్రకాశించినవి.

శ్లో॥ ప్రసూనగంధానిల సంభృతేషు
వనేషు మత్తా మకరందనిర్ఝరైః ।
మిళింద సంఘా విచరంతి సర్వత
స్సకోరకై ః పల్లవిత ద్రుమేషు॥

తా॥ వనములయందు పుష్పపరిమళములతో కూడిన వృక్షములు యందు తుమ్మెదలు సుఖముగా సంచరించినవి.

శ్లో॥ పతంతి రత్నాని సురేతరాణాం కిరీట్ట కోటి గ్రధితా న్యకాండే
తదంగనామానసగహ్వరేషు సగర్భకంపం భయ మావివేశ ॥

తా॥ రాక్షసులు శిరస్సులయందు ధరించిన కిరీటస్థగిత రత్నములు అకస్మాత్తుగా రాలినవి. ఆ రాక్షస స్త్రీలు భయమును పొందిరి. ఈ ప్రకారముగా ఆ హనుమజ్జన్మ మహోత్సవమందు లోకమునకు సుఖమున్నూ, లోకబాధకులైన రాక్షసులకు దుఃఖమున్నూ కలిగెను.

శ్లో॥ ఆంజనేయః పూజితశ్చే త్పూజితా స్సర్వ దేవతాః
హనుమన్మహిమా-శక్యో బ్రహ్మణాపి చ వర్ణితుం ॥

ఆంజనేయుని పూజించిన యెడల సర్వదేవతలను పూజించినట్లే యగును. హనుమంతుని మహిమ ను బ్రహ్మదేవుడు గూడ వర్ణింపజాలడు. బ్రహ్మదేవుడు చరాచర సృష్టికి కర్తయైనను హనుమత్సృష్టి య చరాచరసృష్టి కతీతమైనది. కావున బ్రహ్మదేవుడునూ వర్ణింపలేదని పరాశర సంహిత చెప్పుచున్నది.

**తత్రైవ నవమే పటలే ధ్వజదత్త చరిత్రే**

శ్లో॥ దైవతాని కతి సంతి న భూమౌనైవతాని మనసో మతాని మే
దీక్షితాం జడ దరిద్రర క్షణే దైవతం హనుమదాఖ్య మేవ తత్ ॥

తా॥ లోకములో ననేకులు దేవతలు లేరా ? ఉన్నారు ఉన్నాను వారియందు నా మనస్సు ప్రసరించుటలేదు. జడులను, దరిద్రులను రక్షించిన హనుమంతుడే రక్షింపవలయును. కావున హనుమంతుని మించిన దైవము లేదు.

**హనుమాత్సూక్తాంతే**

శ్లో॥ అంజనేయో విరాడ్రూపీ విశ్వాత్మా పాప కాత్మజః
గౌరీసుత ఈశపుత్రః సర్వకామాన్ దదాతు నః ॥

ఆంజనేయులు విరాడ్రూపి, సర్వదేవాత్మకుడు విశ్వమంతయు ఆయన స్వరూపమే. ప్రపంచమంతయు నగ్నీషోమాత్మకము. అందు అగ్నికి హనుమంతుడు పుత్రుడు. సోమాత్మకులైన పార్వతీశివులకును పుత్త్రుడు అందుచేత ఆయన సర్వదేవతాస్వరూపు డనుట నిర్వివాదాంశము. అట్టి హనుమంతుడు మాకు సర్వమనోరథములు నొసంగునుగాక.

**పరాశర సంహితాయాం ధ్వజదత్తచరిత్రే**

శ్లో॥ బ్రహ్మ విష్ణుశివ మైథిలి శివాః కార్య సిద్ధి శిథిలోద్యమా ముహుః
అంజనాసుత మనుప్రభావతో భుఞ్జతే సుఖ మహర్నిశం ద్విజ ॥

బ్రహ్మవిష్ణు రుద్రులను సీతాపార్వతులును కార్యసిద్ధి పరులు కారు. ఈ దేవతలు కేవలము పారలౌకికులు. కావున వారు ప్రాపంచిక కార్యసిద్ధికి దోడ్పడరు. హనుమంతుడట్లు కాదు. ఆయన పరాపర ప్రపంచ స్వరూపుడు కావున సర్వకార్యసిద్ధి ప్రదు డనుట సత్యము, హనుమదుపాసకుడైన ద్విజుడు సర్వసౌఖ్యములు ననుభవించును.

శ్లో॥ త్వా మామనంతి శ్రుతయో జగతా మాదికారణం
త్వామేవ సృష్టికర్తారం పురుష ప్రకృతేః పరం ॥

స్వామీ! శ్రుతులు నిన్ను పరబ్రహ్మపదార్థమని చెప్పుచున్నవి. సమస్త జగత్తునకు అధికారణమైన పరంజ్యోతివి నీవే నని శ్రుతులు పల్కుచున్నవి. భూతసృష్టి యొనర్చు చతుర్ముఖ బ్రహ్మవును నీవే. ప్రకృతి కతీతుడైన పరబ్రహ్మవును నీవే.

**అపి చ ఏకోవింశ పటలే**

శ్లో॥ సప్తకోటి మహామంత్రా వినా బ్రహ్మాస్త్రవిద్యయా
హనుమా న్మంత్ర జాలానాం మిత్రాణితి విదు ర్బుతాః॥

బ్రహ్మాస్త్ర విద్య యొక్కటి తక్కఁదక్కిన సప్తకోటి మహామంత్రములను హనుమద్విద్యకు లొంగినవే. ఒక బ్రహ్మాస్త్రమునకు మాత్రము హనుమంతుడు దేడు నిమిషాలు లీలగాఁ గట్టుపడెను. ఆ బ్రహ్మయైనను హనుమదను గ్రహముచేతనే యాయనను గట్టుటకు సమర్ధుడయ్యెను. ఇందొక్క విశేషము, బ్రహ్మాస్త్రవిద్యను బ్రహ్మదర్శించిననునది శ్రీ బగళా విద్య తత్వములో త్రిపురసుంగరీ దేవతత్మాకమైనది. హనుమంతుఁడందు జగన్మాత యందలి గౌరవవిశేషముచే దానికి లొంగెనని విశేషజ్ఞులు గమనింపవలయును.

**పరాశర సంహితాయుం**

శ్లో॥ కే వా న పూజయ న్తీ హ ప్రత్యక్ష వరదాయకం
అర్చయన్తి హనూమంతం బ్రహ్మ విష్ణు శివా అపి ॥
హనుమత్సదృశం దైవం నాస్తి నాస్త్యేవ భూతలే
తస్మిన్ సంపూజితే భాను ర్బ్రహ్మ గౌరీ మహేశ్వరః ।
శ్రీ జానకీపతి స్సాక్షా దాదినారాయణః ప్రభుః
ఈశ శక్రాదిశాఃలోకే కుమారో గణనాయకః ॥
బ్రహ్మర్షయో వసిష్ఠాద్యా స్సనకాద్యాశ్చ యోగినః
పితరో వసవో రుద్రాః పూజితా స్స్యుర్న సంశయః ॥

శ్రీ రామచంద్రుడే హనుమదుపాసకుడని సుందరోత్తర కాండ వచనములవలసి స్పష్టమగుచున్నది. హనుమన్మంత్రమునకు శ్రీ రామచంద్రుడే ఋషియయ్యెను. అనగా హనుమన్మంత్రము దర్శించినది శ్రీ రామచంద్రుడే యని తెలియవలయును. ఈ విషయము అగస్త్యసంహితయందును. శ్రీ రామోత్తర తాపిన్యుపనిషత్తు నందును బ్రతిపాదింపఁబడినది. అయినను గోరిన కోరిక లెల్ల బ్రత్యక్షముగా దీర్చు పరమదైవమైన హనుమంతు నెవ్వరుపాసింపరు; బ్రహ్మ విష్ణు రుద్రులు కూడ హనుమదపాసన చేయుచుందురు. హనుమంతుని బోలిన దైవము భూతలమునందు లేనేలేదు. హనుమదుపాసన చేసినందువలన సూర్యుడు, బ్రహ్మ, గౌరీశంకరులు, సాక్షా దాదినారాయణ మూర్తియైన శ్రీ రామచంద్రుడును. ఇంద్రాద్యష్టదిక్పాలురును, స్కంద గణపతులును బ్రహ్మర్షులైన వసిష్ఠాదులును, పరమయోగిపుంగవులైన సనకాదులును, పితృవసురుద్ర గణంబులును బూజింపబడినవా రగుదురు. హనుమంతుడు సర్వదేవతాత్మకుఁడని దీనివలన దెలియనగుచున్నది.

## శ్రీ హనుమత్పూజవలననే, సకల వ్యాధులు సర్వదుష్టగ్రహముల నుండి విముక్తి

శ్లో॥ ఆంజనేయమును ర్లోకే శంకరేణ ప్రకాశితః ।
భూత ప్రేత పిశాచాద్యా శ్శాకినీ బ్రహ్మరాక్షసాః ॥
దృష్ట్వైవ ప్రపలాయంతే మంత్రానుష్ఠానతత్పరమ్ ॥

తా ॥ ఆంజనేయ మంత్రము శంకరునిచే ప్రకాశింపచేయబడినది. అట్టి మంత్రము నుపాసించువానిని చూచుటతోడనే భూత ప్రేతపిశాచాదులు పారిపోవును.

శ్రీ హనుమత్పూజవలననే, సకల వ్యాధులు సర్వదుష్టగ్రహముల బాధలు, నివర్తించు ననుటకు, ఆనంద రామాయణములో మనోహర కాండయందుఁగల ఈ కథను చెప్పుచున్నాము.

శ్లో॥ యదా రామ స్త్రికూటాద్రౌ । నాగపాశైస్తు పీడితః ।
నారదస్య వచః శ్రుత్వా సస్మార వినతాసుతం ॥
తదాసౌ కాశ్యపీవీర స్సమాగత్య రణాంగణే ।
ప్రణామ మకరోత్తస్మై । రామాయామితతేజసే ।
నివార్య పన్నగాస్త్రం, తన్మే ఘనాదసమీరితం .
తుష్టావ రఘువీరం తం స సైన్యంచ సలక్షణం

**గరుడ ఉవాచ**

ఆశ్చర్య మిద మత్యంతం । యద్భవానస్మరద్ధిమాం ।
సతివీరే మహారుద్రే । సగణే శ్రీ హనూమతి ।
సుగ్రీవే సతి నీలేచ । సుషేణే జాంబవత్యపి ।
అంగదే దధివ క్త్రేచ । తారేచ తరళే తధా ।
మైందే సతి మహావీర్యే । కిమత్రాప్తి ప్రయోజనం

**శ్రీరామ ఉవాచ**

భవద్భీతి ముపాగమ్య । విద్రుతాశ్చ భుజంగమాః
ఏతేషు సత్సు వీర్యేషు । కిము సైన్య మపీడయన్ ॥

**గరుడ ఉవాచ**

రామదేవ మహాబాహో । కపీనాం చరితం శృణు ।
ఆత్మనోఽపి సమావిష్టా న్మాకురు ష్వాత్ర గర్హణం ॥
సాక్షా త్త్వం భగవాన్ విష్ణుః లక్ష్మీస్తు జనకాత్మజా ।
సౌమిత్రిః ఫణిరాజోఽయం రుద్రాశ్చ కపయః స్మృతాః ॥

సుగ్రీవో వీరభద్రోయం శంభురేష స్మృతో నలః ।
విద్ధి దాశరధే నూనం గిరిశో నీల ఏవచ ॥
మహాయశా స్సుషేణోఽయం జాంబవాం శ్చాప్యజై కాపాలి ।
అహిర్బుధ్న్యస్త్వంగ దోత్ర దధివక్త్రః పినాకధృత్ ॥
శ్లో॥ అయుతా జిత్త్వయంతారః స్థాణుశ్చ తరళో మతః ।
మైందో భర్గ తను స్సాక్షాత్ హనుమాన్ భగవాన్ స్మృతః ॥
అవతీర్ణా మహా రుద్రాస్త్వ దర్ధం రఘునందన ।
అవసన్ సర్వ దేశేషు నానాపర్వత మధ్యతః ॥
ధృత్వాచ కపి రూరైపాణి అవతేరు ర్మహీతలే ।
సర్వేఽపి కపితాంప్రాప్తాః కారణం తద్బ్రవీమి తే ॥
పురా దేవా స్సురై స్సింధో ర్మధితా ద్వ్యాధయోఽభవన్ ।
నానాపీడాకరా స్సర్వా లూతా విస్ఫోటకాదయః ॥
తైరేవ వ్యాధిభి స్సర్వం పీడితం జగతీతలం ।
ఋషయోపి నృపాలాశ్చ బ్రహ్మాణం శరణం యయుః ॥
ఊచుశ్చ జగతాం నాథం బ్రహ్మాణం కమలోద్భవం ।
త్రాహి త్రాహి జగన్నాథ వ్యాధిభ్యో జగతీ మిమాం ॥
పీడితాం దారుణైర్ఘో పైజ్వరాద్యైశ్చ విషోల్బణై ః ।
త్రిదోషైర్జ ర్జరీభూతాం విభ్రమైర్వ్యాకులీకృతాం ॥
ఔషధాని నసిద్ధ్యంతి మంత్ర యంత్రాణి చైవహి।
పీడయంతి మహారోగా మానవాన్నాశకారిణః ॥
ఏతత్తే కధితం సర్వం బ్రహ్మన్ త్వత్పురత స్సుదీః ॥
తత్తేషాం వచనం శ్రుత్వా రుదన్ సంప్రార్థయ ద్విదిః ॥
తేపి శ్రుత్వా బ్రహ్మ వాక్యం రుద్రా ఏకాదశామలాః ॥
సమాశ్వాస విరంచింతే వీరభద్రాదయ స్సురాః ॥
సంభూయ వానరేష్వేవ సుగ్రీవ ప్రముఖా ఇమే ।
పర్యటన్ పర్వతాగ్రాణి మండలానిచ సర్వశః ॥
నాదయంతో జగత్సర్వం బభుక్కారైః సుదారుణై ః ।
క్ష్వేడితైః క్రీడనైస్తేషాం వ్యాధయో నాశ మాప్నుయుః ॥
తతస్తు సకలాం దృష్ట్వా వానరై ర్భేషజ్జతాం భువం ।
తుతోష భగవాన్ బ్రహ్మా దదౌ తేభ్యో వరాన్ బహూన్ ॥

బ్రహ్మోవాచ

శ్లో॥ యుష్మాస్వపిచ ముద్రాస్తు మృత సంజీవికలా ।
ఆజ్ఞాస్తు సర్వజగతి వేగోఽస్తు మనసస్సమః ॥
యుష్మాన్ స్మరంతి యేమర్త్యాః పూజయంతి భవత్తనూః ।
పతాకా వివిధాః కృత్వా చిత్రతోరణ సంయుతాః ॥
భక్ష్య భోజ్యాని ఖాద్యాని లేహ్యం పేయంచ సర్వశః ॥
యుష్మా నుద్దిశ్యయేమర్త్యాః జుహ్వంతిహి హుతాశనే ॥
హవిః పుణ్యతమం రుద్రాస్తేషాం సిద్ధిర్న సంశయః ।
పాయసేనైవ సాజ్యేన తథైవ తిల సర్పిసా ॥
యజంతి భవతాం వృందం తే యాంతి పరమంపదం ।
ఏవంవై రుద్రమఖిలం గాథా వైశ్వానరీ స్తథా ॥
మానస్తో కేతివా మంత్రో మనోజ్యోతి రథాపినా।
భవతాం యజనం చాత్ర గాయత్ర్యావా ప్రకీర్తితం ॥
ఏవం యే మానవాలోకే విధానం పరికుర్వతే ।
వ్యాధిం ముక్త్వా సుఖాసినా స్త్వంతే యాం త్యక్షయంపదం॥

గరుడ ఉవాచ

శ్లో॥ ఇతిరామ పరావృత్తం కపీనాం కథితం మయా ।
ఏషు రుద్రేషు సర్వేషు హనుమాన్ భద్రనాయకః ॥
విధానం తత్రకర్తవ్యం యత్రాస్తే హనుమత్తను ః ॥
గోపురే హనుమాన్మూర్తి శ్శిలాయాంచ ప్రతిష్ఠితా ॥
తత్ర సర్వం ప్రకర్తవ్యం విధానం పరసత్తమ ॥

శ్రీరాముడు త్రికుటాచలంబున నాగపాశముచే పీడింపబడుచున్నప్పుడు నారదముని యేతించి చెప్పినట్లు గరుడుని స్మరించెను. అంత నావైనతేయుడు రణాంగమునకు వచ్చి శ్రీ రామమూర్తిని వందించి మేఘనాధుని పన్నగాస్త్రము నుపసంహరించి యక్కాలమునసకల సేనలతోడ లక్ష్మణ సమేతుడైన శ్రీరామునికి నమస్కరించి "స్వామీ ఇక్కడ ప్రమథగణముతోడ శ్రీరుద్రుడగు హనుమంతుడు సుగ్రీవ నల నీల సుషేణ జాంబవదంగద దధివక్త్ర తారతరల మైందులుండగా నీవు నన్ను స్మరించితివి గదా ? ఇది మిక్కిలి ఆశ్చర్యముగా నున్నది. నావలన నేమి ప్రయోజన మిచ్చుట గలదు ?" అని అడిగెను. అందుకు శ్రీరాముడు నీ వలన భీతి నొందిగదా పాములు పరుగిడినవి ? మహావీరులందరుండినను అవి సైన్యమును

పీడించినవి గదా? అని పలుకగా నంత నా గరుదు మహాత్ముడగు శ్రీ రామమూర్తి కపుల యొక్క చరిత్రమును వినుము. పరమాత్మ వలనను సమావిష్టులగు వీరిని నీవు నిందించవలదు. సాక్షద్భగవంతుడగు శ్రీ మన్నారాయణుండవు నీవు. లక్ష్మియే సీత. ఈ లక్ష్మణుండు ఆదిశేషుదు. రుద్రులందరును కపులై యున్నారు. ఈ సుగ్రీవుడే వీరభద్రుడు.౧ ఈ నలుడు శంభుడు౨ ఈ నీలుండు గిరీశుండు ౩ ఈ సుషేణుడు మహాయశుండు.౪ జాంబవంతుడు అజౌక పాద్దేవత.౫ అంగదుడు ఇచ్చట నహిర్బుధ్న్యుడు.౬ ధధివక్త్రుండు పినాకదారి ౭ తారుండయుతాజిత్తు ౮ తరలుడు స్థాణుడు. మైందుదు భర్గుండు౧౦ శ్రీ హనుమంతుడే సాక్షాత్ రుద్రావతారుండు ౧౧ ఇట్లు ఏకాదశ మహారుద్రులు శ్రీ రామా! నీ కొరకై అవతరించిరి. వివిధ పర్వతంబులు నడుమ దేశంబుల యందంతట మీరు వసించిరి. వీరు కపులగుట కారణం బేమనిన. మునుపు దేవతలు సముద్రమును మధించినపుడు లూతావిస్ఫోటకాదులు బహుపీడాకరంబులగు రోగంబులు గల్గినవి. వాటిచే లోకంబు పీడింపబడె. ఋషులను రాజులను బ్రహ్మను శరణుజొచ్చిరి. "జగంబంతయు త్రిదోష సంకలితంబులగు మహాజ్వరాది వ్యాధులచే విభ్రాంతి నందె మంత్ర యంత్రౌషధంబులు నిష్ఫలదాయకంబులైనవి. "రక్షింపుము రక్షింపుము" అను వీరి మొరనాలకించి నీ యెదుట బ్రహ్మదేవుండు రుద్రులను సంప్రార్థించెను. ఏకాదశ రుద్రులును బ్రహ్మ వాక్యమును విని వెంటనే వీరభద్రులగు తాము సుగ్రీవాది కపులుగా దేవగణంబుల తోడ నవతరించి, అంతట పర్వతాగ్రంబులో చరించుచు గర్జించుచు క్రీడించుచు వచ్చిరి. అంత నా వ్యాధు లుపశాంతంబులయ్యె. అంత వానరవేష్టితంబగు భూమండలమును చూచి సంతోషించి బ్రహ్మ దేవుండు వారి కిట్లు వరంబులనొసగె. "మీయందు మృత సంజీవినీ" కల ముద్రగా నుండుత. మీ యాజ్ఞ సర్వజగంబున గల్గును గాక. మీ వేగంబు మనోవేగ మగును గాక. నరులేవ్వరు చిత్రతోరణ పతాకం తోడ మీ రూపంబులను పూజించి మిమ్ము నుద్దేశించి యగ్నిలో హోమము చేయుదురో వారికి రుద్రులు ప్రసన్నులై సిద్ధిప్రదులగుచుందురు గాక. తిలపాయసాజ్యంబులచే యజించిన వారు పరమపదము నందెదరు. ఇట్లేగదా మహారుద్రంబును అట్లే వైశ్వానరీ గాధయును. మాన స్తోకే, మనోజ్యోతి ర్గాయత్రీ మంత్రంబులలో దేవి చేతనైనను యజనము జేయదగు. ఇట్లు యజించిన నరులు మహా వ్యాధి విముక్తి నంది యంతమున నక్షయ పద మందెదరు." అని బ్రహ్మ వరము కలదు. కావున శ్రీ రామా! ఈ రుద్రమూర్తులలో నందరిలో హనుమంతుడు భద్రనాయకుండు. ఇవ్విధానంబున హనుమన్మూర్తి గల చోట చేయందగు గోపురములయందు హనుమన్మూర్తి యున్న నచ్చట నీ క్రమము ననుసరింపనగునని గరుడుడు శ్రీరాములు వారితో విన్నవించెను.



# శ్రీ రామ పూజావిధిః

ఏవం తిథౌ॥ గో॥ నా ॥ ఆయుష్యాభివృద్ధ్యర్థం।హనుమత్సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న పరివారసమేత శ్రీ రామచంద్ర దేవతా ముద్ధిశ్య శ్రీ రామ చంద్రదేవతా ప్రీత్యర్థం। సంభవద్భిర్ద్రవ్యైః సంభవద్భిరుపచారై స్సంభవతా నియమేన శ్రీ రామచంద్రదేవతాం యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే ॥ తదంగ కలశారాధనం కరిష్యే ॥ కలశం గంధ పుష్పాద్యై రలంకృత్య ॥



శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః
మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణా స్థితాః ।
కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా పసుంధరా
ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ॥
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబుసమాశ్రితాః॥

**మంత్రం :**

ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే । ఉక్థ్యెక్వజ్ఞేషు వర్ధతే ॥ ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతా న్యాపః ప్రాణావా ఆపః పశవ ఆపోన్న మాపో౽మృత మాప స్సరా దాప శందాగ్ం స్యాపో జ్యోతిగ్ం షాపో యజూగ్ం స్సత్య మాప స్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువ రాప ఓమ్ ॥

శ్లో॥ గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు ॥

ఆయాంతు శ్రీరామ పూజార్థం దురితక్షయ కారకాః కలశోదకేః దేవ మాత్మానం పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య ॥ తతః పుష్పం గృహీత్వా సపరివారం శ్రీ రామచంద్రం ధ్యాయేత్ ॥

సపరివారాయ శ్రీ రామచంద్ర స్వామినే నమః, ధ్యాయామి ॥

శ్లో॥ ఆవాహయామి విశ్వేశం జానకీ వల్లభం హరిం ।
కౌసల్యా తనయం విష్ణుం శ్రీరామం ప్రకృతేః పరం ॥
శ్రీ రామ ఆవాహయామి ॥

శ్లో॥ రాజధిరాజ రాజేంద్ర రామచంద్ర మహీపతే ।
రత్న సింహాసనం తుభ్యం దాస్యామి స్వీకురు ప్రభో ॥
శ్రీ రామ రత్నసింహాసనం సమర్పయామి ॥

శ్లో॥ త్రైలోక్య పావనో-సి త్వం నమస్తే రఘునాయక ।
పాద్యం గృహాణ రాజర్షే నమో రాజీవలోచన ॥
శ్రీ రామ పాదయో : పాద్యం సమర్పయామి ॥

శ్లో॥ పరిపూర్ణ పరానంద నమో రామాయ వేధసే ॥
గృహాణార్ఘ్యం మయా దత్తం కృష్ణ విష్ణో నమోస్తుతే ॥
శ్రీ రామ హస్తయో ర్ఘ్యం సమర్పయామి ॥

శ్లో॥ గృహాణాచమనం నాథ సర్వలోకైక నాయక ।
బ్రహ్మాండోదర సంస్థోసి నమః శ్రీ రఘునాయక ॥
శ్రీ సీత రామాయనమః. ముఖే ఆచమనీయం సమర్పయామి ॥

శ్లో॥ పయో దధి ఘృతోపేతం శర్కరా మధుసంయుతం ।
గృహాణ రామరాజేంద్ర స్నానం పంచామృతాంచితం ॥
శ్రీ సీత రామః శుద్ధోదక స్నానం సమర్పయామి ॥

శ్లో॥ సంతప్తకాంచనమయం పీతాంబర మిదం హరే ।
సంగృహాణ జగన్నాథ రామచంద్ర నమోస్తుతే ॥
శ్రీ రామ దివ్య పీతాంబరం సమర్పయామి ॥

శ్లో॥ శ్రీరామాచ్యుత గోవింద శ్రీధరానంతరాఘవ ।
బ్రహ్మసూత్రం చోత్తరీయం గృహాణ రఘునాయక ॥

శ్లో॥ కిరీట హార కేయూర రత్నకంకణ మేఖలాః ।
గ్రైవేయం కౌస్తుభం చ మణికంకణ నూపురాః ।
ఏవ మాదీని సర్వాణి భూషణాని నృపోత్తమ ।
అహం దాస్యామి సద్భక్త్యా సంగృహాణ జనార్ధన ॥
శ్రీ సీత రామః అనర్ఘ రత్నాభరణాని సమర్పయామి ॥

శ్లో॥ కుంకుమాగరుకస్తూరీ కర్పూరోన్మిశ్ర చందనం ।
తుభ్యం దాస్యామి దేవేశ శ్రీరామ స్వీకురు ప్రభో ॥
శ్రీ రామ దివ్య చందన హరిద్రాచూర్ణ కుంకుమాది
సుగంధ ద్రవ్యాణి సమర్పయామి ॥

శ్లో॥ తులసీకుంద మందార జాతీ పున్నాగ చంపకైః ॥
కదంబ కరవీరైశ్చ కుసుమై శ్శతపత్రకై :
నీలాంబు జైర్బిల్వదళైః పుష్పహారైశ్చ రాఘవ ।
పూజయామి మహాభక్త్యా సంగృహాణ జనార్ధన ॥
శ్రీ రామ నానావిధ పరిమళ పత్ర పుష్పాణి పూజయామి ॥



## అథాష్టోత్తర శతనామపూజా



**ప్రతి నామమునకు ముందుగా ఓమ్ అని చదువుకొనవలయును**

ఓమ్ శ్రీరామాయ నమః
రామభద్రాయ నమః
రామచంద్రాయ నమః
రాజీవలోచనాయ నమః
శ్రీమతే నమః
రాజేంద్రాయ నమః
రఘుపుంగవాయ నమః
జానకీవల్లభాయ నమః
జైత్రాయనమః
జితామిత్రాయ నమః
జనార్ధనాయ నమః
విశ్వామిత్ర ప్రియాయ నమః
దాంతాయ నమః
శరణత్రాణతత్పరాయ నమః
వాలి ప్రమథనాయ నమః
వాగ్మినే నమః
సత్యవాచే నమః
సత్యవిక్రమాయ నమః
సత్యవ్రతాయ నమః
వ్రత ధరాయ నమః
సదాహనుమదాశ్రితాయ నమః
కౌసలేయాయ నమః
ఖరధ్వంసినే నమః
విరాధవధ పండితాయ నమః
విభీషణ పరిత్రాత్రే నమః
దశగ్రీవశిరోహరాయ నమః
సప్త తాళ ప్రభేత్రే నమః

వేదాంతసారాయ నమః
వేదాత్మనే నమః
భవరోగస్యభేషజాయ నమః
దూషణశిరోహంత్రే నమః
త్రిమూర్తయే నమః
త్రిగుణాత్మకాయ నమః
త్రివిక్రమాయ నమః
త్రిలోకాత్మనే నమః
పుణ్యాచారిత్రకీర్తనాయ నమః
త్రిలోకరక్షకాయ నమః
ధన్వినే నమః
దండకారణ్యపుణ్యకృతే నమః
అహల్యాశాపశమనాయ నమః
పితృభక్తాయ నమః
వరప్రదాయ నమః
జితేంద్రియాయ నమః
జితక్రోధాయ నమః
జితమిత్రాయ నమః
జనార్ధనాయ నమః
ఋక్షవానరసంఘాతినే నమః
చిత్రకూట సమాశ్రయాయ నమః
జయంత త్రాణతత్పరాయ నమః
సుమిత్రాపుత్ర సేవితాయ నమః
సర్వదేవాదిదేవాయ నమః
సదావానర సేవితాయ నమః
మాయామారీచహంత్రే నమః
హర కోదండఖండనాయ నమః

మహాభోగాయ నమః
జామదగ్న్యమహాదర్పదళనాయ నమః
తాటకాంతకాయ నమః
సౌమ్యాయ నమః
బ్రహ్మణ్యాయ నమః
మునిసంస్తుతాయ నమః
మహాయోగినే నమః
మహోదారాయ నమః
సుగ్రీవేప్సితరాజ్యదాయ నమః
సర్వపుణ్యాధిక ఫలాయ నమః
స్మృతసర్వాఘనాశనాయ నమః
ఆదిపురుషాయ నమః
మహాపురుషాయ నమః
పురాణపురుషస్తుతాయ నమః
పుణ్యోదయాయ నమః
దయాసారాయ నమః
పురాణపురుషోత్తమాయ నమః
స్మిత వక్త్రాయ నమః
హరయే నమః
సుందరాయ నమః
అనంత గుణగంభీరాయ నమః
సీతవాసనే నమః
మాయామానుషచారిత్రాయ నమః
సేతుకృతే నమః
మితభాషిణే నమః
పూర్వభాషిణే నమః
రాఘవాయ నమః
సన్వతీర్థమయాయ నమః
మహాభుజాయ నమః
సర్వదేవస్తుత్యాయ నమః
సర్వయాజ్ఞాధిపాయ నమః
యజ్వనే నమః
జరామరణవర్జితాయ నమః
శివలింగప్రతిష్ఠాత్రే నమః
సర్వాభరణ భూషితాయ నమః
పరమాత్మనే నమః
పరబ్రహ్మణే నమః
సచ్చిదానంద విగ్రహాయ నమః
పరస్మై జ్యోతిషే నమః
పరస్మైధామ్నే నమః
పరాకాశాయ నమః
పరాత్పరాయ నమః
పరేశాయ నమః
పారగాయ నమః
పారాయ నమః
శ్యామాంగాయ నమః
శూరాయ నమః
ధీరోదాత్త గుణాశ్రయాయ నమః
ధనర్ధరాయ నమః
మహాదేవాదిపూజితాయ నమః
జితరాశయే నమః
సర్వ దేవాత్మకాయ నమః
శివాయ నమః
శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సరివార
సమేత శ్రీ రామ చంద్రాయ నమః॥

శ్రీ రామా నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి ॥

శ్లో॥ వనస్పత్యుద్భవై ర్దివ్యై ర్నానాగం ధైస్సుసంయుతం ।
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం ॥

శ్రీరామ ధూప మాఘ్రాపయామి

శ్లో॥ సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినా యోజితం మయా,
గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహం ॥

శ్రీరామ దీపం దర్శయామి

ధూప దీపానంతరం ఆచమనీయం సమర్పయామి॥

శ్లో॥ ఇదం దివ్యాన్న మమృతం రసై షడ్భి స్సమన్వితం ।
శ్రీ రామ రామ రాజేంద్ర నైవేద్యం ప్రతిగృహ్యతాం ॥

శ్రీరామ నైవేద్యం సమర్పయామి

శ్లో॥ పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం।
సచూర్ణం జానకీనాథ తాంబూలం ప్రతిగృహ్యతాం ॥

శ్రీరామ తాంబూలం, సువర్ణపుష్పదక్షిణాం సమర్పయామి.

శ్లో॥ మంగళార్థం మహీపాల నీరాజనమిదం హరే ।
సంగృహాణ జగన్నాథ రామచంద్ర నమోస్తుతే ॥

శ్రీరామ మంగళ నీరాజనం దర్శయామి ॥

శ్లో॥ తప్త జాంబూనదేనైవ నిర్మితం రత్నభూషితం ।
మంత్రపుష్పం ప్రదాస్యామి రఘుశ్రేష్ఠ నమోస్తుతే ॥

శ్రీరామ మంత్రపుష్పం సమర్పయామి॥

శ్లో॥ యాని కాని చ పాపాని జన్మాంతరకృతానిచ ।
తాని తాని ప్రణశ్యంతు ప్రదక్షిణ పదేపదే ॥

శ్రీరామ ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ॥

శ్లో॥ నమో బ్రహ్మణ్య దేవాయ రామాయా-కుంఠ మేధసే
ఉత్తమశ్లోకధుర్యాయ న్యస్త దండార్పితాంఘ్రయే ॥
ఇందీవరదళశ్యామో రామో రాజీవలోచనః
మానసే వర్తతే యస్యేం తాం సీతాం ప్రణమామ్యహం॥
ద్వితో రామ నమ స్త్రితో దశకృత్వ సహస్రధా
శతకృత్వోనంతకృత్వో భూయో భూయో నమోస్తుతే॥

శ్రీరామ దండవ త్ప్రణామం సమర్పయామి ॥

శ్లో॥ నృత్త గీతైశ్చ వాద్యైశ్చ పురాణ పఠనాదిభిః
రాజోపచారై రఖిలై స్సంతుష్టో భవ రాఘవ ॥

శ్రీరామ రాజోపచారాన్ సమర్పయామి ॥

అనేన మయా కృతేన షోడశోపచార పూజనేన సపరివార శ్రీరామ సుప్రీతో స్సుప్రసన్నో వరదో భవతు ॥ అని అక్షతలు ఉదకము వదలిపెట్టవలెను.

శ్రీ రామచంద్ర ప్రసాదం శిరసా గృహ్ణామి.

శ్రీ రామ తారకమంత్రమును యథాశక్తి జపించేది.





## శ్రీ సీతాదేవి అంగపూజ

ఓం చంచలాయై నమః పాదౌ పూజయామి । చపలాయై నమః జానునీ పూజయామి। పీతాంబరధరాయై నమః ఊరూ పూజయామి । కమలవాసిన్యై నమః కటిం పూజయామి। పద్మాలయాయై నమః నాభిం పూజయామి యమళమాత్రే నమః స్తనౌ పూజయామి । లలితాయై నమః భుజద్వయం పూజయామి । కంబుకంఠ్యై నమః కంఠం పూజయామి । సుముఖాయై నమః ముఖం పూజయామి । శ్రియై నమః నాసికాం పూజయామి । సునేత్రాయ నమః నేత్రే పూజయామి । రమాయై నమః శిరః పూజయామి । శ్రీ సీతా దేవ్యై నమః సర్వాణ్యంగాని పూజయామి॥

## శ్రీ సీతా అష్టోత్తర నామావళి

### ప్రతి నామమునకు ముందుగా ఓమ్ అని చదువుకొనవలయును

ఓం శాంతాయై నమః
మహేశ్వర్యై నమః
నిత్యాయై నమః
శాశ్వత్యై నమః
పరమాక్షరాయై నమః
అచింత్యాయ నమః
కేవలాయై నమః
అనంతాయై నమః
శివాత్మనే నమః
పరమాత్మికాయై నమః
జానక్యై నమః
మిధిలానందాయై నమః
రాక్షసాంతవిధాయిన్యై నమః
రమ్యాయై నమః
రామవక్షస్థలస్థాయై నమః
ప్రాణేశ్వర్యై నమః
ప్రాణరూపాయై నమః
ప్రధాన పురుషేశ్వర్యై నమః
సర్వశక్త్యై నమః
జోత్స్నాయైనమః
కాలాయై నమః
కాష్ఠాయై నమః
ఇందుమహిమాస్పదాయే నమః

పురాణ్యై నమః
చిన్మయై నమః
పుంసమాధ్యై నమః
పురుషరూపిణ్యై నమః
భూతాంతరాత్మనే నమః
కూటస్థాయై నమః
మహాపురుష సంజ్ఞితాయై నమః
స్వకార్యాయై నమః
కార్య జనన్యై నమః
బ్రహ్మేశాయై నమః
బ్రహ్మసంశ్రయాయై నమః
వ్యక్తాయై నమః
ప్రథమజాయై నమః
బ్రహ్మణ్యై నమః
మహాత్మనే నమః
జ్ఞానరూపిణ్యై నమః
మహేశ్వర్యై నమః
సముత్పన్నాయై నమః
భుక్తి ముక్తి ఫలప్రదాయై నమః
సర్వేశ్వర్యై నమః
సర్వవర్ణాయై నమః
నిత్యాయై నమః
ముదితమానసాయ నమః
వాసవ్యై నమః
వరదాయై నమః
వాచ్యాయై నమః
కర్త్రైనమః
సర్వార్థసాధికాయై నమః
వాగీశ్వర్యై నమః
సర్వవిద్యాయై నమః
మహావిద్యాయై నమః

సుశోభనాయై నమః
శోభాయై నమః
వంశకర్త్యై నమః
లీలాయై నమః
మానిన్యై నమః
పరమేష్టిన్యై నమః
త్రిలోకసుందర్యై నమః
కామచారిణ్యై నమః
విరూపాయై నమః
సురూపాయై నమః
భీమాయై నమః
మోక్ష ప్రదాయిన్యై నమః
భక్తార్తి నాశిన్యై నమః
భవ్యాయై నమః
భవభావని వాసిన్యై నమః
వికృత్యై నమః
శాంకర్యై నమః
శాంత్యై నమః
గంధర్వ యక్ష సేవితాయై నమః
వైశ్వానర్యై నమః
మహాశీలాయై నమః
దేవసేనాయై నమః
గృహ ప్రియాయై నమః
హిరణ్మయ్యై నమః
మహారాత్ర్యై నమః
సంసారపరివర్తి కాయై నమః
సుమాలిన్యై నమః
సురూపాయై నమః
తారిణ్యై నమః
భావిన్యై నమః
ప్రభాయై నమః

జగత్ప్రియాయై నమః
జగన్మాత్రే నమః
అమృతాశ్రయయై నమః
నిరాశ్రయాయై నమః
నిరాహారాయై నమః
నిరంకుశాయై నమః
రణోద్భవాయై నమః
శ్రీ ఫల్యై నమః
శ్రీ మత్యై నమః
శ్రీ శాయై నమః
శ్రీనివాసాయై నమః
హరిప్రియాయై నమః
శ్రీకర్త్యై నమః
కామప్రియాయై నమః
ఓం శ్రీ ధరాయై నమః
ఈశవరిత్యై నమః
శ్రీ వేదవత్యై నమః
శ్రీ హనుమదాశ్రితాయై నమః
మహాలక్ష్మ్యై నమః
సరసామృతధాత్ర్యై నమః
శ్రీ పట్టాభిరామ ప్రియాయై నమః

**శ్రీ సీతాదేవ్యై నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి ॥**



## శ్రీ ఆంజనేయ సుప్రభాతము



శ్లో॥ అమల కనకవర్ణం ప్రజ్వలత్పావకాక్షం
సరసిజనిభవక్త్రం సర్వదా సుప్రసన్నం
పటుతరఘనగాత్రం కుండలాలంకృతాంగం
రణజయకరవాలం రామదూతం నమామి ॥

అంజనా సుప్రజా వీర పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ హరిశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం ॥
ఉత్తిష్ఠోత్తిష్ఠ హనుమన్ ఉత్తిష్ఠ విజయధ్వజ
ఉత్తిష్ఠ రవిజాకాంత త్రైలోక్యం మంగళం కురు ॥

శ్రీరామచంద్ర చరణాంబుజ మత్తభృంగ
శ్రీరామమంత్రజపశీల భవాబ్ధిపోత
శ్రీ జానకీ హృదయతాపనివారమూర్తే
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ రామదివ్య చరితామృతపానలోల
శ్రీ రామకింకర గుణాకర దీనబంధో
శ్రీ రామభక్త జగదేక మహోగ్రశౌర్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

సుగ్రీవమిత్ర కపిశేఖర పుణ్యమూర్తే
సుగ్రీవ రాఘవసమాగమ దివ్యకీర్తే
సుగ్రీవ మంత్రివర శూరకులాగ్రగణ్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

భక్తార్తి భంజన దయాకర యోగివంద్య
శ్రీ కేసరీ ప్రియతనూజ సువర్ణదేహ
శ్రీ భాస్కరాత్మజ మనోంబుజచంచరీక
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ మారుత ప్రియతనూజ మహాబలాఢ్య
మైనాకవందిత పదాంబుజ దండితారిన్
శ్రీ ఉష్ట్రవాహన సులక్షణ లక్షితాంగ
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

పంచాననాస్య భవభీతిహరస్య రామ
పాదాబ్జ సేవనపరస్య పరాత్పరస్య
శ్రీ అంజనాప్రియసుతస్య సువిగ్రహస్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

గంధర్వ యక్ష బుజగాధిప కిన్నరాశ్చ
ఆదిత్య విశ్వ వసురుద్ర సురర్షిసంఘాః
సంకీర్తయంతి తవ దివ్యసునామపంక్తిం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥



శ్రీ గౌతమ చ్యవన తుంబుర నార దాత్రి
మైత్రేయ కృష్ణజనకాది మహర్షి సంఘాః
గాయంతి హర్షభరితా స్తవ దివ్యకీర్తిం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

భృంగావళీ చ మకరందరసం పిబే ద్వై
కూజం త్యుతార్థమధురం చరణాయుధాశ్చ
దేవాలయే ఘన గభీర సుశంఖ ఘోషాః
నిర్యాంతి వీర హనుమం స్తవ సుప్రభాతమ్ ॥

పంపాసరోవర సుపుణ్య పవిత్ర తీర్థ
మాదాయ హేమకలశైశ్చ మహర్షిసంఘాః
తిష్ఠంతి శ్రీ చరణపంకజ సేవనార్థం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ సూర్యపుత్రిప్రియనాథ మనోజ్ఞమూర్తే
వాతాత్మజాత కపివీర సుపింగళాక్ష
సంజీవరాయ రఘువీరసుభక్తవర్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥





## శ్రీ హనుమత్పూజా విధానము

పూ ॥ తిథౌ ॥ గో ॥ నా ॥ మమ శరీర ఆవాహిత గర్భస్థిత సమస్త భూత ప్రేత పిశాచాది సర్వబాధా నివృత్త్యర్థ్యం, దుష్టస్థాన స్థితా యే యే గ్రహాః తద్దోష పరిహారార్థం శ్రీ హనుమత్పూజా ప్రదక్షిణాని కరిష్యే ॥ తదాదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థ్యం గణాధిపతి పూజాం కరిష్యే ॥ అథ హనుమత్పూజా విధిః ॥

శ్లో॥ అంజనానందనం వీరం కోటి బాలార్క సన్నిభం
ధ్యాయామ్యహం రామదూతం సర్వదా హృదయాంబుజే ॥
శ్రీ మదాంజనేయ పరబ్రహ్మణే నమః ధ్యానం సమర్పయామి ॥

శ్లో॥ ఆవాహయామి పింగాక్షం మహావీర్యం మహాబలం
వాయుసూనుం రామభక్తం లంకానిర్మూలకారణం ॥
శ్రీఆంజనేయ ఆవాహనం సమర్పయామి ॥

శ్లో॥ రత్నసింహాసనం చారు జాంబూనదమయం శుభం
ప్రీత్యర్థ్యం తవ దాస్యామి సంగృహాణ ద్రుతం ప్రభో ॥
శ్రీ ఆంజనేయ రత్న సింహాసనం సమర్పయామి ॥

శ్లో॥ పాద్యం దదా మ్యహం భక్త్యా నిర్మలం పావనం శుభం
గృహాణ వానరాధీశ సుగ్రీవ ప్రియబాంధవ ॥
శ్రీఆంజనేయ పాద్యం సమర్పయామి ॥

శ్లో॥ అర్ఘ్య మష్టాంగ సంయుక్తం శుభ్రం తే ప్రదదా మ్యహం ।
గృహ్యతాం కరుణాసింధో పీతవస్త్రం ప్రసీద భో ॥
శ్రీఆంజనేయ అర్ఘ్యం సమర్పయామి ॥

శ్లో॥ వాసితం సర్వతీర్థేభ్యః ఆసీతం శీతలం శుభం ।
దదా మ్యాచమనార్థం తే గృహ్యాతా మంజనాసుత ॥
శ్రీఆంజనేయ ముఖే ఆచమనీయం సమర్పయామి॥

యత్పురుషేణ హవిషా॥ పంచామృత స్నానం సమర్పయామి ॥

శ్లో॥ గంగా గోదావరీ ముఖ్యా నదీభ్య స్సముపాహృతం ।
జలం దదామి స్నానార్థం స్వీకురుష్వ హరీశ్వర ॥
శ్రీఆంజనేయ శిరస్స్నానం సమర్పయామి ॥

శ్లో॥ నవరత్నమయీం దివ్యాం మేఖలాం హేమనిర్మితాం ।
దదామి తుభ్యం గృహ్ణీష్వ శ్రీరామప్రియ మారుతే ॥
శ్రీఆంజనేయ కటిసూత్రం సమర్పయామి ॥

శ్లో॥ పీతకౌశేయ కౌపీనం ధార్యం చ బ్రహ్మచారిభిః ।
అర్పయామి మహాబాహో గృహాణ పవనాత్మజ ॥
శ్రీఆంజనేయ కౌపీనం సమర్పయామి ॥

శ్లో॥ పీతవస్త్రయుగం దేవ ప్రయచ్ఛామి తవ ప్రభో
ప్రీత్యర్థం పావనే మహ్యం ప్రసీద కరుణాకర ॥
శ్రీఆంజనేయ వస్త్రయుగ్మం సమర్పయామి ॥

శ్లో॥ రాజితం బ్రహ్మసూత్రం చ నిర్మితం బ్రహ్మణా పురా ।
ప్రీత్యర్థం తవ దాస్యామి సంగృహాణ కపీశ్వర ॥
శ్రీఆంజనేయ బ్రహ్మసూత్రం సమర్పయామి ॥

శ్లో॥ చందనం రోచనామిశ్రం హరిద్రా కుంకుమాన్వితం ।
స్వీకురుష్వ దయాసింధో మయార్పిత మిదం ప్రభో ॥
శ్రీఆంజనేయ దివ్య చందనం సమర్పయామి॥

శ్లో॥ అక్షతాం స్తవదాస్యామి హరిద్రాక్తాన్ శుభ ప్రదాన్।
రామ ప్రియ నమస్తుభ్యం సంగృహాణా-ంజనాసుత ॥
శ్రీఆంజనేయ అక్షతాన్ సమర్పయామి ॥

శ్లో॥ కిరీట హార కేయూర కటకాంగుళి ముద్రికాః
ధారయస్వ మయాదత్తాః భక్త్యా కపికులోత్తమ॥
శ్రీఆంజనేయ సర్వాభరణాని సమర్పయామి॥

శ్లో॥ చంపకారక్త పున్నాగ జాతీ మందార చంపకైః ।
త్వాం పూజయా మ్యహం భక్త్యా సుప్రప్రీదా-ంజనాసుత ॥
శ్రీఆంజనేయ నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి॥

## అథాంగపూజా

ఓం హనుమతే నమః పాదౌ పూజయామి। గూఢ గుల్ఫాయ నమః గుల్ఫౌ పూజయామి । అంజనా గర్భ సంభూతాయ నమః జంఘే పూజయామి। అతి బలపరాక్రమాయ నమః ఊరూ పూజయామి। ఉదధి లంఘనాయ నమః కటిం పూజయామి। సీతాశోకాపహారిణే నమం నాభిం పూజయామి। కాలనేమిమథనాయ నమః హృదయం పూజయామి। మకరీవిపాటనాయ నమః స్తనౌ పూజయామి। సంజీవన ధరాధర ధారిణే నమః బాహూ పూజయామి। సుగ్రీవ సచివాయనమః గ్రీవం పూజయామి। లక్ష్మణ ప్రాణదాత్రే నమః పూజయామి। భక్తాభీష్ట ప్రదాయకాయ నమః సర్వాణ్యంగాని పూజయామి ॥

## అథదిక్పాలపూజా

ఇంద్రాయ నమః। అగ్నయే నమః। యమాయ నమః। నైరుతయే నమః। వరుణాయ నమః। వాయవే నమః। కుబేరాయ నమః। ఈశానాయ నమః।



## అథాంజనేయాష్టోత్తర శత నామావళిః

ఓం ఆంజనేయాయ నమః
ఓం మహావీరాయ నమః
ఓం హనుమతే నమః
ఓం మారుతాత్మజాయ నమః
ఓం తత్త్వజ్ఞానప్రదాయ నమః
ఓం సీతాదేవీముద్రాప్రదాయ నమః
ఓం అశోకవనికాచ్ఛేత్రే నమః
ఓం సర్వమాయావిభంజనాయ నమః
ఓం సర్వబంధవిమోక్త్రే నమః
ఓం రక్షోవిధ్వంసకారకాయ నమః
ఓం పరవిద్యాపరీహారాయ నమః
ఓం పరశౌర్యవినాశకాయ నమః
ఓం పరమంత్ర నిరాకర్త్రే నమః
ఓం పరమంత్రప్రభేదకాయ నమః
ఓం సర్వ గ్రహవినాశినే నమః
ఓం భీమసేనసహాయకృతే నమః

ఓం సర్వతంత్ర స్వరూపిణే నమః
ఓం సర్వయంత్రాత్మికాయ నమః
ఓం కపీశ్వరరాయ నమః
ఓం మహాకాయాయ నమః
ఓం సర్వరోగహరాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం బలసిద్ధికరాయ నమః
ఓం సర్వవిద్యా సంపత్ప్రదాయ నమః
ఓం కపిసేనానాయకాయ నమః
ఓం భవిష్యచ్చతురాననాయ నమః
ఓం కుమార బ్రహ్మచారిణే నమః
ఓం రత్నకుండల దీప్తిమతే నమః
ఓం సంచలద్వాల సన్నద్ధలంబ
మానశిఖోజ్వలాయ నమః
ఓం గంధర్వవిద్యాతత్వజ్ఞాయ నమః
ఓం మహాబలపరాక్రమాయ నమః

ఓం సర్వదుఃఖహరాయ నమః
ఓం సర్వలోక చారిణే నమః
ఓం మనోజవాయ నమః
ఓం పారిజాత మూలస్థాయ నమః
ఓం సర్వమంత్ర స్వరూపవతే నమః
ఓం ప్రతాపవతే నమః
ఓం వానరాయ నమః
ఓం కేసరీసూనవే నమః
ఓం సీతాశోకనివారకాయ నమః
ఓం అంజనాగర్భసంభూతాయ నమః
ఓం బాలార్కసదృశాననాయ నమః
ఓం విభీషణ ప్రియకరాయ నమః
ఓం దశగ్రీవ కులాంతకాయ నమః
ఓం లక్ష్మణ ప్రాణదాత్రే నమః
ఓం వజ్రకాయాయ నమః
ఓం మహాద్భుతాయ నమః
ఓం చిరంజీవినే నమః
ఓం రామభక్తాయ నమః
ఓం దైత్యకార్యవిఘాతకాయ నమః
ఓం అక్షహంత్రే నమః
ఓం కాంచనాభాయ నమః
ఓం పంచవక్త్రాయ నమః
ఓం మహాతపసే నమః
ఓం లంకినీభంజనాయ నమః
ఓం శ్రీమతే నమః
ఓం సింహికా ప్రాణ భంజనాయ నమః
ఓం గంధమాదనశైలస్థాయ నమః
ఓం లంకాపురవిదాహకాయ నమః
ఓం సుగ్రీవసచివాయ నమః
ఓం ధీరాయ నమః
ఓం శూరాయ నమః
ఓం కారాగృహవిమోక్త్రే నమః
ఓం శృంఖలాబంధమోచకాయ నమః
ఓం సాగరోత్తరకాయ నమః
ఓం ప్రాజ్ఞాయ నమః
ఓం రామదూతాయ నమః
ఓం పింగళాక్షాయ నమః
ఓం వార్ధిమైనాకపూజితాయ నమః
ఓం కబళీకృతమార్తాండమండలాయ నమః
ఓం విజితేంద్రియాయ నమః
ఓం రామసుగ్రీవసంధాత్రే నమః
ఓం మహారావణమర్దనాయ నమః
ఓం స్ఫటికాభాయ నమః
ఓం వాగధీశాయ నమః
ఓం నవవ్యాకృతిపండితాయ నమః
ఓం చతుర్బాహవే నమః
ఓం దీనబంధవే నమః
ఓం మహాత్మనే నమః
ఓం భక్తవత్సలాయ నమః
ఓం సంజీవననగాహర్త్రే నమః
ఓం శుచయే నమః
ఓం వాగ్మినే నమః
ఓం దృఢవ్రతాయ నమః
ఓం కాలనేమి ప్రమథనాయనమః
ఓం హరిమర్కట మర్కటాయ నమః
ఓం దాంతాయ నమః
ఓం శాంతాయ నమః
ఓం ప్రసన్నాత్మనే నమః
ఓం శతకంఠమదాపహృతే నమః
ఓం యోగినే నమః
ఓం రామకథాలోలాయ నమః

| | |
|---|---|
| ఓం చైత్యకులాంతకాయ నమః | ఓం సీతాన్వేషణపండితాయ నమః |
| ఓం సురార్చితాయ నమః | ఓం వజ్రదంష్ట్రాయ నమః |
| ఓం మహాతేజసే నమః | ఓం వజ్రనఖాయ నమః |
| ఓం రామ చూడామణిప్రదాయ నమః | ఓం రుద్రవీర్యసముద్భవాయ నమః |
| ఓం కామరూపిణే నమః | ఓం ఇంద్రజిత్ప్రహితామోఘ బ్రహ్మాస్త్ర వినివారకాయ నమః |
| ఓం లోకపూజ్యాయ నమః | |
| ఓం పార్థధ్వజాగ్రసంవాసినే నమః | ఓం జాంబవత్ప్రీతి వర్ధనాయ నమః |
| ఓం శరపంజర భేదకాయ నమః | ఓం సీతాసమేత శ్రీ రామ పాద సేవా దురంధరాయ నమః |
| ఓం దశబాహవే నమః | |

**శ్రీఆంజనేయ నానావిధ పరిమళపత్ర పుష్పాణి సమర్పయామి॥**

శ్లో॥ వనస్పతి సముద్భూతై ర్గంధాఢ్యై స్సుమనోహరైః ।
గుగ్గులాద్యై స్సమోపేతః ధూపోయం ప్రతిగృహ్యతాం ॥
శ్రీఆంజనేయ ధూప మాఘ్రాపయామి ॥

శ్లో॥ సర్వవర్తిత్రయో పేతం గోఘృతేనప్లుతం శుభం ।
సకలధ్వాంతమరణం దీపం తే దర్శయామ్యహం ॥
శ్రీఆంజనేయ దీపం సందర్శయామి॥

శ్లో॥ నైవేద్యం షడ్రసోపేతై ర్భక్ష్యైర్భోజ్యై స్సమన్వితం ।
మధురై ర్మృదులై ర్నిత్యం అర్పయా మ్యరిమర్దన ॥
శ్రీఆంజనేయ నైవేద్యం సమర్పయామి॥

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి। శుద్ధాచమనీయం సమర్పయామి ॥

శ్లో॥ పూగీపల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం ।
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥
శ్రీఆంజనేయ తాంబూలం సమర్పయామి॥

శ్లో॥ స్వర్ణపాత్ర స్థితం చారు ప్రదీప్తం తిమిరాపహం
కర్పూరహారతిం దివ్యం స్వీకురుష్వ శివాంశజ॥
శ్రీఆంజనేయ ఉత్తర నీరాజనం సమర్పయామి॥

శ్లో॥ మందారైః పారిజాతైశ్చ మల్లికాభిశ్చ చంపకైః ।
పుష్పాంజలిం ప్రదాస్యామి స్వర్ణపద్మై స్సమన్వితం ॥
శ్రీఆంజనేయ సువర్ణమంత్రపుష్పం సమర్పయామి॥

శ్లో॥ ప్రదక్షిణం కరోమి త్వాం భక్తియుక్తేన చేతసా ।
బహుజన్మార్జితం పాపం శమయే ద్వాయునందన ॥
శ్రీఆంజనేయ ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి॥

శ్లో॥ ఉమాధీశ తేజో సముద్భూత నిత్యం
మమాభీష్టసిద్ధిం కురుష్వ ప్రసన్నః ।
నమామి త్వదీయాంఘ్రియుగ్మారవిందౌః
సమస్తాపరాధం క్షమస్వ ప్రభో మే ॥
శ్రీఆంజనేయ క్షమాపణం సమర్పయామి॥

శ్లో॥ రామదూత నమస్తుభ్యం సీతాశోక వినాశక।
లక్ష్మణస్య ప్రాణదాతా కురు మ ద్వాంచితం ఫలం ।
అంజనా గర్భ సంభూతా లంకా ప్రాణాపహారక।
రావణోద్యాన విధ్వంసిన్ కురు మ ద్వాంఛితం ఫలం ॥
ప్రసన్నో భవ మే స్వామిన్ ప్రసన్నార్తి ప్రభంజన ।
త్వత్పాద సన్నిభం ప్రాప్తం పాహి మాం కరుణాకర ॥
శ్రీఆంజనేయ అనేక నమస్కా రాన్ సమర్పయామి ॥

శ్లో॥ యాని కానిచ పాపాని జన్మాంతర కృతాని చ ।
తాని తాని ప్రణశ్యంతు ప్రదక్షిణ పదే పదే ॥
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః ।
త్రాహి మాం నరకాద్ఘోరాత్ వాయు పుత్ర నమోస్తుతే ॥

శ్రీఆంజనేయ ఆత్మప్రదక్షిణం సమర్పయామి అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మక శ్రీమదాంజనేయ స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవ్త త్వితి జలం నిక్షిపేత్ ॥

శ్రీ సుందర హనుమద్వైభవే
ద్వితీయోధ్యాయ స్సమాప్తః

## అష్టాక్షరీ మహామంత్రము

అస్యశ్రీ ఆంజనేయాష్టాక్షరీ మహామంత్రస్య ఈశ్వర
ఋషిః అనుష్టుప్ ఛందః హనూమాన్ దేవతా
ఆం బీజం నమః శక్తిః ఆంజనేయాయ ఇతి కీలకం
శ్రీ హనుమత్ప్రసాద సిద్ధ్యర్థే వినియోగః

